# ఆంధ్రమాత

## (ఆత్మకథ)



— తొలిపలుకు —

శ్రీ జి. సీతారామ్ స్వామి.

---

దేశభాషలందుఁ • దెలుఁగు లెస్సంచు శ్రీ
రాయ లలరె నాఁడు; • రామ! రామ!!
దేశమందు నేఁడు • తెలుఁగు దేశం బవి
తల్లియేడ్వ గుండె • జల్లు మనదె?

---

విజయవాడ ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల యందు
ముద్రింప బడియె. 1952



వెల 0-8-0

: రచయిత :

వేదాంతకవి మల్లెల దావీదు.

# — తొలి పలుకు —

## స్వామి సీతారామ్, తపోవనము, భీమవరము.

శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు గారు ఈ చిన్నిపొత్తములో ఒక నూతన పంథా త్రొక్కారు. సామాన్యంగా వ్యక్తులు తమ ఆత్మకథలో లోకోద్ధారణకై వ్రాస్తూ ఉంటారు. దేశాలకు ప్రాణప్రతిష్ఠ చేసి, దేహాత్మలను కల్పించి అలాటి వ్యక్తులచేత తమ ఆత్మకథ చెప్పించుట సొంపుగా నున్నది.

కవిత్వము ద్రాక్షాపాకములో సులువైన భాషలో అనర్గళముగా ప్రవహించుచున్నది. తన అపార పాండితీగరిమచే సుమారు 2, 3 వేల సంవత్సరములనాటి చరిత్రాంశములను, పురాణ ఇతిహాసములలోని సమాచారములను సమకూర్చి యీ గ్రంథమును అమూల్యముగా ఒనర్చినారు.

సత్వర ఆంధ్రరాష్ట్ర స్థాపనకై ఆంధ్రులు ఉద్యమించారు సమయమున ఆంధ్రమాత చరిత్ర తన బిడ్డల కందరకును జవదాట వీలుకాని శుభలేఖయై అలరారును. త్యాగ సమాపేతులు కమ్మని ప్రోత్సాహపరచును.

వ్యవసాయ గోపోషణమును గూర్చి కవి దెల్పిన యీ భావములు శిలాక్షరములతో ప్రతి ఆంధ్రగృహమున ఉత్తమ సందేశంగా లిఖించనగును. గాంధిజీ సందేశముకూడా యిదే.

"నా జీవన మూలంబౌ । భూజీవనమగును; దగును; భూజీవనమౌ । గోజీవనమున గూడును; । మీజీవనమునకు నిదియ మేల్బంతి సుమీ"॥ 44

62 వ పద్యం కూడా ముచ్చటగా నుంది. తెలుగు తెన్గు అనుటకు 67 వ పద్యంలో కవి యిట్లు సమర్థించారు:-

త్రినగమను పదవికృతియే । తెనుఁగని మఱి తేనె యగును. దెనుఁగ నియుఁ దెలుం ! గనఁ దెనుఁగని తెన్ననఁదను । గను నానార్థములు నాకు సార్థకములగుౘ.

తెన్ అనగా దక్షిణాది, మధురం అని కూడా అర్థము.

తెలుగు సాహిత్యమును గూర్చి తల్లి 82 వ పద్యములో సంతృప్తిని తెలుపుచున్నది. 90 వ పద్యము ఎన్నటికి విసువు కలిగించనిరీతి తెలుపుచున్నది. కవికి కవిత్వమందుండే పరమాదరము 91 వ పద్యములోని యీ వాక్యం స్పష్టపరచుచున్నది.

'కవితా పచనం బాబాల వృద్ధ పరమాన్నంబా!' కవికికూడా క్షీరాన్న మన్న మక్కువయని తోచును. 95 వ పద్యం ఔత్తరేయులకు తెలుగు యేలా శిరోమానికమైనది తెలుపుచున్నది. 99 వ పద్యంలో పోతన యెడ చూపిన భక్తి ప్రశంసనీయము. అమృతాంజనముయొక్క ఖ్యాతి యీ కవినికూడా ఆకర్షించినది.

విద్యావంతులకొక హెచ్చరిక 147 వ పద్యం. 179 వ పద్యంలో 183 వ పద్యంలో ఆంధ్రమాత తన సంతానమంతా సమానముగా చూస్తూ అలా చూడనొల్లని వారి మనస్తత్త్వములోని లోపమును యీ విధంగా గుర్తించినది:—"తక్కువ లెక్కువలు ప్రేమ తగ్గిన హెచ్చున్."

అస్పృశ్యతనుగూర్చి 184 వ పద్యములో కవి తేలికైన మాటలలో నిరసించి యున్నారు. సామెతలనుకూడ సరిగా అక్కడక్కడ పొందుపరిచారు, "పెద్దలమాట పెరుగుకూడు, తలమానికమూ."

రాష్ట్రవాంఛ కవిని బాగా పురికొల్పుచున్నది. స్వరాష్ట్రము సంపాదించెడు దనుక నిద్రపట్టునె మనకున్॥ 188.

195 వ పద్యంలో కవి తన సంఘ సంస్కరణ ప్రీతిని వెల్లడించారు. ఆంధ్రాన్ని గురించి కవియొక్క ఆదర్శ మిది.

"కావలెను విశాలాంధ్రము। కావలెను స్వరాష్ట్రః మాత్మగౌరవ మొందం। గావలెను స్వర్గరాజ్యము। గావలె నాచంద్రతారకంబుగ వెలుఁగన్"॥ 200.

ఆంధ్రరాష్ట్రము సర్వోదయ రాష్ట్రము కావలెనన్న ప్రచారకుల హృదయవాంఛితమే కవిని ఈ గ్రంథరచనకు పురికొల్పింది. ఇందులో యింకను పేర్కొనదగిన హృద్యములగు పద్యము లనేకములు కలవు. దీని నందుకొని ఇందలి రసములను ఆంధ్రులు చవిచూతురుగాక.

దీనికి తొలిపలుకు వ్రాసే అవకాశము కల్పించినందుకు కవికి నేను కృతజ్ఞుడను.

సీతారామ్.

గాంధీకళము

30-౧౨-౫

# ఆంధ్రమాత

## (ఆత్మకథ)

శ్రీకారము కృతి కకలం
కాకార మొనర్చు నందు ♦ రందఱు; పరమా
త్మాకార "మాత్మకథ" కుం
బ్రాకారంబని స్మరింతుఁ ♦ బ్రారంభింతున్. 1

అమ్మా! స్వీయ కథం జెపు
మమ్మా! నీపేరు నూరు ♦ నామూలాగ్రం
బిమ్మా వీనుల విందా
నమ్మాయన; మిన్నకున్న ♦ నలుగుదురు సుతుల్. 2

ఆత్మస్తుతి తగదంచు మ
హాత్ములు బోధింపరే? ని♦రాక్షేపంబా
నాత్మకథామృతపానం
బాత్మజులకు నీతిబోధ ♦ కాధారంబా. 3

### 1. నా వాస్తవ్యము.

నాతండ్రి దేవ దేవుఁడు;
నాతలి శ్రీభారతాంబ ♦ నవనాగరకుల్
నాతోఁబుట్టువు లాయా
సేతు హిమాచలమునను వ♦సింతురు కారే? 4

పతిభ్యూపతి యిల్లంధ్రము
సుతులాంధ్రులు లాఁతులెల్ల ♦ జుట్టాలును నా

మత మాస్తిక్యము నేనో
బ్రతికి చెడినదాన మంద ♦ భాగ్య నయోగ్యన్. 5
ఇల "నాంధ్రోర్విహమ్మ"నియెదఁ
దెలుఁగనుచుఁ ద్రిలింగ మనుచుఁ ♦ దెనుఁగనుచు నౌరుల్
దలకొక్క రీతిఁ బిలిచినఁ
బలికెదను వికృతియు నన్నఁ ♦ బండిత సింహుల్. 6
తొలి గంగా సింధువులన
జలభరితము, దక్షిణాది ♦ జనభరితంబై
విలసిల్లెనంచు విద్వాం
సులు వక్కాణింప నద్ది ♦ చోద్యంబగు నే? 7
మేమన నేటికి? భారత
భూమియు భూమధ్య మనఁగ ♦ భూగోళము త
ద్భూమికి నాంధ్రము కేంద్రం
బై మెలఁగునఁటన్న వల్లె ♦ యనరె యనాంధ్రుల్? 8
ఉత్తర దేశంబా యా
ర్యోత్తములకు దక్కనన్న ♦ నో యాద్యులకో;
నుత్తర దక్షిణ దిక్కుల
పొత్తును సంపత్తు నాకుఁ ♦ బొందా; విందా. 9
మన రాజమండ్రి నాభియు
నను వగు నా చెన్నపురియు ♦ నర్థవ్యాసం
బనఁ గైకొని యొకవృత్తం
బును గీయ మదీయదేశ ♦ మును దృశ్యంబా. 10
ఉత్తర సర్కారులలో
దత్తపు మండలమునందు – దక్కనులో దే

ళోత్తరమున దక్షిణమున
నుత్తమ దశదిశల వాస ♦ మొనరెన్; దనరెన్. 11
ధరఁ జిత్తూరునఁ గాళ
శ్వరమును, గర్నూలు నందె♦సఁగు శ్రీశైలం
బరయఁగఁ దూరుపు గోదా
వరి దాక్షారామమును ని♦వాసదిశలగున్. 12
తెనుఁగన విశాఖపట్టణ
మును, గోదావరి యనంత ♦ పురమును గుంటూ
రును, బళ్ళారియుఁ గర్నూ
ల్లన నగు నెల్లూరు కృష్ణ ♦ కడపయుఁ జిత్తూర్. 13
పలనాడు పాకనాడును
వెలినాడును ములికినాడు ♦ వేఁగీనాడున్
బొలుపొ పొట్టిపినాడును
గల విమ్మహిఁ దెలగ కమ్మ ♦ కొసలనాడుల్. 14
దక్కనన దక్షిణంబౌ;
దక్కను మధ్యభరతమాతృ ♦ దక్షిణకరమౌ
నిక్కము నే నంగుష్టముఁ;
దక్కిన వ్రేళ్ళెల్ల నల్ల ♦ ద్రావిడ జనముల్. 15
"మన భూమి వంటి దగు క
మ్మని భూమియు లేదఁ"టంచు ♦ మన రాయ ప్రో
లన లేదె? తెనుఁగు గడ్డను
నెనయఁగుఁ గద తెనుఁగుగడ్డ ♦ యిది యడ్డగునే? 16
ధర బందరు గుంటూరు న
మరఁగను నేలూరు రాజ ♦ మండ్రి చికాకోల్

పురసంపాదనమున ను
త్తర సర్కారులగు రాజ ♦ ధానికిఁ దలమై. 17

పదునాఱు నూఱులును ము
ప్పది తొమ్మిదవేటఁజెన్న ♦ పట్నము చెన్న
ప్పదియగా; "ఈస్టిండియ" వా
రదికొని "సెంట్‌జార్జి" కోఁట ♦ యటఁ గట్టి రహిన్! 18

మును పల్లది * నల్లపురం
బును, దెల్లపురమని చెన్న ♦ పురి పౌనరారెన్,
దెనుఁగులకున్ నల్లపురం
బును హూణులకెల్లఁ దెల్ల♦పురమున్ జెల్లెన్. 19

అఱవలుఁ, గర్ణాటకులును,
మఱియును హూణులుఁ దురుష్క ♦ మళయాళులు నీ
తెఱఁగున మన మత్తెఱఁగునఁ
జెఱిసగమగు జనులసంఖ్య ♦ చెన్నపురమునన్. 20

చెన్నప్పపల్లె కిప్పుడు
చిన్నెలు వన్నెలునుగల్గ ♦ శిరమౌ; మదరా
సన్న ననాంధ్రము నిజముగఁ;
జెన్నపురీనామమునను ♦ జెలఁగినఁ దెలుఁగౌ. 21

మాయింటఁ బుట్టి పెరిగిన
మాయాఁడు పడుచు వరించి ♦ మాదన మీకున్
న్యాయంబ ? వేషభాషలు
మీయఱవలవైనఁ బురము ♦ మీకున్ మాకున్. 22

* Black Town (Now George Town)

భారత సంస్థానముల శి
రోరత్నము గోలుకొండ ♦ రుచిరముతో మై
సూరును బంగనపల్లి కు
మారీ మణులగు మదీయ ♦ మహిమాస్పదముల్. 23

ఎక్కువ మక్కువ కాఁగఁ బు
డుకోటయుఁ గోఁట తెలుఁగు ♦ తోఁబుట్టులకుఁ
జక్కని లాంచన మెంచఁగ
నిక్కందగు నాంధ్రమందు ♦ నేత్రోత్సవమా. 24

నన్నూట నలువ దినమం
దన్న జమీందారు లిందు ♦ నభ్యుదయార్థం
జెన్నని మేల్గొనర్చుచుఁ
జెన్నలరారుదురు కారె ♦ చిన్ని కుమారుల్ ? 25

ధర విజయనగరముఁ బిఠా
పుర మింకను వేంకటగిరి ♦ బొబ్బిలియును దే
వరకోఁట కాళహస్తియుఁ
బరఁగును గార్వేటి నగరు ♦ ప్రఖ్యాతములై. 26

మునగాల, చల్లపల్లియు,
నొనరంగను లింగగిరియు, ♦ నుయ్యూ రెలమ
ఱ్ఱును, మైలవరము, నూజీ
డును, మిర్జాపురముఁ దనరె ♦ దగఁ ఖ్యాతములై. 27

ఒకయెడ * నాంధ్రాఖాతం
బొకకడ సాంద్రాటవులు మ ♦ ఱొకచోట బయ
ళ్లొకచాయ నేళ్లుఁ గోనే
ళ్లొకమూలను బైరుపచ్చ ♦ లో ముచ్చటయా. 28

* బంగాళాఖాతము.

అనుపమ టైగ్రిస్ తీరం
బును నైలునదీ ప్రదేశ ♦ మును గంగా సిం
ధు నదీప్రాంతము నుపమిం
చును గోదావరియుఁ గృష్ణ ♦ చోటుల్ దోఁటల్. 29

పురుడించు నందు గోదా
వరి గంగాదులను దీర్థ ♦ వైభవమునఁ బు
ష్కర మన్నను బండిత పా
మరు లువ్విళ్ళూర దాని ♦ మరు లేమొక్కో! 30

కృష్ణుఁడన విష్ణువందురు;
కృష్ణానది దక్షిణమునఁ ♦ గీరితి కెక్కెన్;
గృష్ణయు మండల మయ్యెను:
గృష్ణా గౌతముల నాంధ్ర ♦ కేంద్రము లనరే! 31

మనది యరణ్యా శరణ్యం
బనఁజను భువియని వచించె ♦ నాదిని గొట్టి
ల్యుని శాస్త్రము;*కామేశం
బును గన్గొనెఁగలప దృఢము ♦ బొందఁగ మందుఁగ. 32

భారతవైచిత్ర్యంబుల
నారయ నేడందు; రండు ♦ నందముతో న
ల్లోరా ఫలకమ్ములో
ప్పారుఁ దెలుంగాణమున జ ♦ నాకర్షకముల్. 33

మును విజయనగరవరమున
కెనయగు నగరంబు నెవ్వఁ - డెన్నఁడు లోకం

* శ్రీ శొంఠికామేశము.

బునఁ గనలేదని పర్షి
యనుఁ డబ్దుల్ రజకు వలికె ♦ నాశ్చర్యమునన్. 34
స్వల్పములె యాంధ్ర విలస
చ్ఛిల్పంబు ? లనల్పశిల్ప ♦ చిత్రకళాసం
కల్పంబు నిల్పకున్నె
కల్పాంతమువఱకుఁ బంచ ♦ ఖండములందున్ ? 35
ఎల్లోరాయు నజంతా
యెల్లూరును హనుమకొండ ♦ యమరావతియున్
నెల్లూరు హంపియు నోరం
గల్లు మహాబలిపురములఁ ♦ గళ కన్పిందా. 36
పూర్వుల శిల్పౌన్నత్యము
పర్వెను గర్వాస్పదమన ♦ బర్లిన్ లండన్
సర్వకళాశాలాదులఁ;
బర్వంబా నేత్రములకుఁ ♦ బ్రావీణ్యమునన్. 37
అల కాళహస్తి సింహా
చలమును శ్రీపర్వతంబుఁ ♦ జక్కని భద్రా
చలమును దాక్షారామము
బాలుపగు తిరుపతి త్రిలింగ ♦ పుణ్యస్థలముల్. 38
* ముటిఫలి నాకాశ్రియ మెం
తటి కీర్తి గడించెఁ దొల్లి ♦ తల్లికి నిపు డెం
తటి దుస్థితి! యెటుఁబోయెనొ
కటకట † మున్నూఱు నావికా స్థానంబుల్. 39

* మోటుపల్లి (బాపట్ల తాలూకా)
† 300 ఓడరేవు లుండెనని అబ్దుల్ రజాకు (క్రీ. శ. 1428—48) వ్రాసెను.

గోదావరి కృష్ణయు ము
న్నాదరువులు సాగర ప్రయాణంబున నే
డాదరు పీతెఱ వాయెను
లేదా నదులకు విముక్తి ♦ లేశంబైనన్ ? 40
పారావారము భళియన
భారత నౌకలు విశాఖపట్టణమునఁ బెం
పారు సు నౌకాశ్రియు మా
ధారము మాకన్నఁ గన్నఁ ♦ దల్లికి ముదమా. 41
రాయల సీమా ! క్షామపు
మాయలఁ జిక్కియు మలమల ♦ మాఁడితివా ? శ్రీ
రాయల కాలమునఁ బువ్వుల్
కాయలతో నలరఁ గడకుఁ ♦ గడగండ్లయ్యెన్. 42
కైతుల వెతఁగని కాటక
భూతముఁ బోకార్ప మన ప్ర ♦ భుత్వంబునకౌ.
నా తుంగభద్ర యత్నము
భూతల కైలాస మొసఁగుఁ ♦ బొలము సఫలమౌ. 43
నాజీవన మూలంబౌ
భూజీవన మగును; దగును; ♦ భూజీవనమౌ
గోజీవనమునఁ గూడును;
మీజీవనమునకు నిదియ ♦ మేల్బంతిసుమీ. 44
ఒంగోలు జాతి గోగణ
మంగౌ; గుంటూరు, కిమిడి ♦ డాంగేదేయు నే
న ంగౌ; బొబ్బిలిదున్న మె
సంగును భూతంబనంగ ♦ జగము నెఱుంగన్ 45

ఇల సగముపంట పసుగణ
ములు, దక్కను చైనదేశ ♦ ములఁ జెలఁగంగన్
గలిగెనని వావిలాప్పుఁడు
సెలవిడెఁగద ? తత్ప్రశంస ♦ చెల్లదె మనకున్ ? 46
వరి, జొన్న, రాగి, సజ్జయు,
వరగయు, గోధుమయుఁ, గొఱ్ఱ ♦ వరధాన్యాదుల్;
మిరెపయుఁ, బొగాకుఁ, బప్పాలు,
మిరియము, మఱిచెఱకుఁ, గాఫి ♦ మేల్పదివేలా. 47
సురుచిరము లండ్రు గోదా
వరి చక్కెరకేళి, సిద్ధ ♦ వట్టమునందా
కరబూజ, నూజివీటిని
ముఱియుఁగ మామిళ్ళు, వడ్ల♦పుడి నారింజల్. 48
నెల్లన వడ్లు తమిళమున;
నెల్లూరన వడ్లయూరు; ♦ నెయి కాఱుఁ దినన్
నెల్లూరి బియ్యమున; మన
కెల్లెడ లభ్యంబు కాశి ♦ కెగుమతియు నగున్. 49
కోలారు మహిమ మేమా
మేలిమి పండున్ బొలాన ♦ మేల్ వణిజులకున్;
గోలారమ్మను శివమని
తాలికి బంగారమడుగఁ ♦ దనకుం గఱవా. 50
ఇనుమును, వెండియుఁ, దగరం
బును, రాగియు, నభ్రకమును, ♦ బొగ్గును, జిప్సమ్,
మొనజైటు, జింకు, గ్రానై
టును మున్నగఁ గలవి యొన్నఁ♦దున్ లభ్యములా. 51

పలకలు, సిమెంటు, కాగిత
ములు, దంతపుఁ బనులు, లక్క♦బొమ్మలును, దివా
సులు, నిప్పుపెట్టెలును, లే
సులు, పింగాణులును, సబ్బు ♦ సులభము లయ్యెన్. 52

"కొహినూరు" వజ్రరాజము
మహిమోన్నతిఁగన్న రాజ ♦ మకుటమణి యగున్.
బహురత్నగర్భయుం జా
మహనీయుఁడు కీట్సు నన్ను ♦ మతి స్మరియించెన్. 53

ప్రత్తియు సంపత్తియు, యు
త్పత్తియుగుంగాదె సర్వ ♦ దత్తావనిలో
నుత్తర సర్కారులలో ?
నుత్తమమని దూఁదిగొనుచు ♦ నుంద్రు విదేశ్యుల్. 54

మన వారు సాలెపట్టో
యనఁ బుట్టంబులను నేయ ♦ నధిపతులా స
న్నని వసనంబులఁ దాలిచి
రని *మార్కోపోలో వర్త ♦ కాగ్రేసరుఁడౌ. 55

ఖద్దరనఁ గల్పవృక్షం
బద్దియు శుద్ధస్వదేశ్య ♦ మని రేయివగల్
బెద్దలు పిన్నలు నేసియు
ఖద్దరుఁ గట్టన్ సువర్ణ ♦ కాలము రాదే ? 56

చీరాలయుఁ బేరాలయుఁ
జీరలపైఁ గథల లిపులఁ ♦ జిత్రింపఁగ, సు
బ్బారాయుఁడు భట్టిప్రో
లోఁకోరిక లీడేఱ నేయుఁ ♦ గోట్లన్ గోట్లన్. 57

* వెనిసున్ వర్తకుఁడు (క్రీ. శ. 1291).

మన రాజధానిలో నా
ల్గనుపమ పట్టణములందు ♦ * రద్దకమున కం
దున మూఁడు తెనుఁగు నాటివి;
కనమెద్దియు బందర రద్ద ♦ కమునకు నుద్దిన్. 58

## 2. నా వాఙ్మయము.

తల్లియు సంస్కృత వాణియు,
చెల్లియ కన్నడము, చెల్ల ♦ చెవరైతిమి; మా
పిల్లలు నొక్కరి నొక్కరు
నొల్లరు; తద్వేషభాష ♦ లో ద్వేషితముల్. 59

అంధుఁడగు నగ్నిమిత్రుని
యంధం బడఁగింప నగ్ని ♦ యాంధ్రించిడ న
య్యంధుఁడు చూపొందుటయఁట !
యంధతఁ బోకార్చు వాఙ్మ ♦ యం బాంధ్రంబా. 60

మునులు మహర్షులు భాషాం
గన కుగ్గులుపోసి పెంచఁ ♦ గణ్వాదిబుధుల్
ఘనలక్ష్య లక్షణంబులఁ
దనులతఁ గైసేయలేదె ♦ తరతరములుగాన్ ? 61

పలుకులు తేనెం జిల్కఁట
వలనంగాఁబోలు “దేశ ♦ భాషలయందున్
దెలుఁగే లెస్సని శ్రీరా
యలు సెలవిడె; రాచనుడి ని♦రర్థకమానే ? 62

* క్రీ. శ. 135 కొండలుగాని బందరు కలంకారి అద్దకమునకు ప్రసిద్ధి.

పేరిమి వర్ణించుచు నా
వే "రాండారే" యటంచుఁ • *ప్లిని పేర్కొనె; సం
చారుఁడు † మెగస్తనీసును
గోరి ప్రశంసించు వ్రాసి • కొని "యిందిక"లోన్. 63
వినమే తూర్పున కితలియు"
యని పొగడెను జేమ్సు విల్లి • యమ్మున్ నన్నున్;
దెసఁగే తేటయనఁగ ము
క్కను విఱువ కనాంధ్రు లొప్పు • కొంద్రు నిజముగన్ 64
సదయులు ప్రపంచ భాషలఁ
బదునేడవదనియు నన్నుఁ • బ్రాచ్యంబున నె
న్మిదవ దని, దక్షిణాదిని
మొదటి దనియు ముఱియుచుంద్రు • ముఖ్యత్వమునన్. 65
తెలుఁగనఁ ద్రిలింగమనియును
దిలలుంగోవులు దెలంగు • దేశంబనియున్
దెలియగుఁ బ్రదేశమనియుం
దలఁతురె మీప్రజ్ఞ నెల్లఁ • దల్లికిఁ దెల్పన్ ? 66
త్రినగమను పదవికృతియే
తెనుఁగని మఱి తేనెయగును • దెనుఁగనియుఁ దెలుం
గనఁ దెనుఁగని *తెన్ననఁ దెనుఁ
గను నానార్థములు నాకు • సార్థకము లగున్. 67

---

* రోమా చరిత్రకారుఁడగు ప్లిని (క్రీ. శ. 61-113)
పేరు—"ANDARAE" అని వ్రాసెను. (H, N, VI, 19, 22)
† క్రీ. పు. 317—312 (Magastha LVI-10)
* తెన్ అనఁగా దక్షిణము ( తమిళము )

తెలుఁగున దత్సమ తద్భవ
ములు, దేశ్యంబులును, గ్రామ్య ♦ ములు, నన్యపదం
బులు లీనమాయె; నేఱులు
జలధిం జేరియు నపార ♦ సాగర మగుఁగా? 68

వరిమిల, దర్జా, దర్బార్,
తరహా, తారీఖు, రోజు, దండూరా, చా
కిరి, గోషా, గోరీ, సబ,
బురు, సిస్తిరి, కిస్తి, నాస్త ♦ యుర్దు పదంబుల్. 69

నోటును, చెక్కును, నంబరు,
ఘాటును, కంట్రాక్టు, ఆక్టు, ♦ గ్యారంటీయున్,
లాటరి, రైలు, రసీదున్,
హ్యాటును, కోట్, బూటు, సూటు ♦ నాంగ్లపదంబుల్. 70

గీర్వాణాంధ్రద్వయమూ
సర్వోత్తమ భాషలంచు ♦ సమము లఁటంచున్
గీర్వాణమున లిఖించెను
బూర్వమునఁ బితాంజలి నిజ ♦ ముం జెప్పెనవన్. 71

ఇలలోఁ జీనాబ్సినీ
యులకెక్కువ యక్కరంబు ♦ లగు; భారత భా
షలలోఁ దెలుఁగున కక్షర
ములు నేఁబదియాఱఁటంచు ♦ మురియంగఁ దగున్. 72

తొలిఁ బ్రాకృత సంస్కృత భా
షలబలె మద్భాష యుపని♦షత్కాలమునన్

గలిగెనని * యథర్వంబును
వెలిఁబుచ్చెన్ నచ్చి సర్వ ♦ విబుధులు మెచ్చన్. 73
వాదంబుకాదు మన ఋ
గ్వేద మహాభారతముల ♦ వేయేటికి స్కాం
దాది పురాణాదులలోన్
నాఁడా ప్రస్తావనము క ♦ నంబడకున్నె ? 74
నిజమా ఎ, ఒ, ఁ (అరసున్నయు)
చే, జే, అలు నాంధ్రేతరులకు ♦ సరిపడవఁట ! నా
చే, జే, లుచ్చరించి వ్రాయుట
యిష్టేకఁట మెప్పింపఁబడుల ♦ నీఁక బ్రహ్మకునా. 75
ఒక్కటి యమరావతి నిం
కొక్కటి శ్రీశైలమందు ♦ నొక్కటి వేంగిన్
జెక్కులు విద్యాపీఠము
లిక్కడ నక్కడను వెలసె ♦ నిపుడొకటి కటా! 76
లాసాపురమున వెలసిన
భాసురవిద్యాలయంపు ♦ భవనము మద్వి
ద్యాసదనమునకు సమమని
శాసనము టిబెట్టునందుఁ ♦ జాటఁగ వినమే ? 77
రొట్టె విఱిఁగి నేతిని బడి
నట్టుల భాషాప్రయుక్త ♦ మగు పరిషత్తై
పుట్టిన + యాంధ్ర సరస్వతి
ముట్టినయది యెల్లయాణి ♦ ముత్యముకాదే ? 78

---

* త్రిమూర్తీనాం సంస్కృతాంధ్ర ప్రాకృతాస్తు ప్రియంకరాః
(అథర్వశిఖోపనిషత్తు)

\+ ఆంధ్ర సర్వకళాశాల (1926)

'విశ్వకళా పరిషత్తె'
శాశ్వత విద్యాభివృద్ధి ♦ సల్పుచు విజ్ఞా
నైశ్వర్యమన్న మానవ
పశ్వాదుల విశ్వకళలఁ ♦ బైకింపీయున్, 79

కనకోత్త్రమైన * "తేజ
స్వినావధిత మస్తు"న నిట ♦ శ్రేయోస్తనరే ?
మనకున్ స్వస్తి యగుంగా
కని "స్వస్తిక" విస్తరిలు ది ♦ గంతఖ్యాతిన్. 80

వలయంబు నుండి వర్ణం
బులు గలిగెనఁటంచు గంట ♦ మున లిఖియింపన్
సులువంచు, లేఖనము ము
ద్దులు గులుకు నఁటంచుఁ బలుకు ♦ దురు ‡ పాశ్చాత్యుల్. 81

సంపూర్ణ వర్ణమాలయు,
సొంపై కన్పింప లిపియు ♦ సులువౌ, బలువౌ
నింపగు నుచ్చారణమును,
బెంపౌ సాహిత్య మొప్పఁ; బేర్కొలదానన్. 82

మును "చదువుఁ గట్టిపెట్టుం
డా"నఁగ లిఖిత తాళపత్త్ర ♦ మని తెలియరే? లే
ఖను దాటి కమ్మపై వ్రా
యనదియుఁ గమ్మయు ననంగ ♦ నయ్యెంగాదే ? 83

---

* "మాయధ్యన విషయములపై వెలుగుపడు గాక" (ఆంధ్రవిశ్వ కళాపరిషన్ముద్రికాసూత్రము.)

‡ జి. హెర్బర్టువేర్, ఏం. ఏ.; ఎఫ్.-ఎం. యు.

అక్షరలిపి సమకూరిచి,
లక్షణముల నేఱుపఱచి, ♦ లక్ష్యంబుల సం
రక్షించి, గ్రంథముల ము
ద్రాక్షర శాలల నొనర్ప ♦ నగు లక్ష లనన్. 84

భువిఁ బదునెనిమిద నూర్లా
ఱవ వత్సరమందు నక్ష ♦ రము లచ్చువడన్
నవయుగ మన * నాంధ్ర నిఘం
టువు ముద్రితమయ్యె; వెల్గె ♦ దున్ వాఙ్మణియున్. 85

పలుభాషలఁ దెలుఁగును, వి
ద్యలలోఁ గవితయును శ్రేష్ఠ ♦ మండ్రు కవీంద్రుల్;
దలఁపఁగ నాంధ్ర కవిత్వం
బలరును బరిమళము పసిఁడి ♦ కమరిన కరణిన్. 86

కష్టంబని ఛందస్సున
నిష్టంబగు మార్పొనర్ప ♦ నెంత్రు నియంతల్;
స్పష్టంబు తద్విధానము;
"కష్టేఫలి" వలదు దాని ♦ కన్నడ చేయన్. 87

అఱసున్న యేటికని బం
డిఱ వలదని, పాటలకు వ ♦ డియుఁ బ్రాసం బ
క్కఱ లేదని, గ్రాంథిక మే
కొఱకాదని డీకొనంగఁ ♦ గోవిదులకునా. 88

"లోకో భిన్నరుచి" యనఁగఁ
బ్రకటమగా ప్రౌఢశైలిఁ ♦ బ్రాజ్ఞులు, ద్రాక్షా

* శబ్దమంజరి 1827 లో అచ్చుబడియె.

పాకముఁ బ్రాకృత లోకం
బేకగ్రీవముగఁ గోర ♦ రే యంధ్రమునన్ ? 89

కందము బంధము; సీసము
మందము; వృత్త్రాదులెల్ల ♦ మధుతుల్యము, లా
నందము గీతము; విసువుం
జెందము సంగీత మన్నఁ ♦ జెవులకు విందౌ. 90

వచనంబున సురుచిర ని
ర్వచనంబున వారు వీరు ♦ రసములఁ జిల్కన్
రచనం బొనర్పఁ గవితా
పచనం బాబాలవృద్ధ ♦ పరమాన్నంబౌ. 91

ఆంధ్ర కవిత్వం బొక్కటి,
యాంధ్రీకరణము ద్వితీయ ♦ మాంగ్లీకరణం
బాంధ్రేతర కవితలు మూఁ
డాంధ్రకవీంద్రుల కృతంబు ♦ లంద్రు మహాంధ్రుల్. 92

తెనుఁ గేకార్థము సాధ్యం
బని ద్వ్యర్థముఁ గష్టసాధ్య ♦ మని తత్ త్ర్యర్థం
బును దుస్సాధ్యం బందురు;
మన ద్వ్యర్థియుఁ ద్ర్యర్థియును స♦మర్థింపనగున్. 93

తనయులు ము న్నేకాక్షర
మని బంధకవిత్వ మనియు ♦ నచ్ఛాంధ్రకృతం
బనియు నిరోష్ట్యాది వినూ
తన కావ్యవిధానమార్గ ♦ దర్శులు కారే ! 94

ఆటకు మాటకుఁ బాటకు
పాటంబు తెనుంగు నిర్వి♦వాదం బిది; క

ర్ణాటో త్తరాయ గాయక
కోటికిఁ గూడలియుఁ బట్టుఁ • గొమ్మయు సుమాత్ర. 95
సుకవులు సంస్కృత కర్ణా
టక హిందీభాషలను బఠన మొనరిచి త
న్మకరంద మాని సద్ గ్రాం
థిక సేవను జేయ వెనుక • దీయరు ధాత్రిన్. 96
నన్నయ యాంధ్ర కవీంద్రుల
కన్నయ తిక్కన కవిత్వ • మనఁ జిక్కన యిం
కెన్నఁగ నెఱ్ఱాప్రగడయు
నన్నన్నా ప్రెగడ భార • తాంధ్రీకృతమున్. 97
రామాయణ భాషాంతర
మా మాధుర్యంబు భాస్క • రాదికవిత శ్రీ
రాములు కట్టిన్ గొట్టిన్
భామం దెచ్చెన్ గవీంద్రు • బలఁగముతోడన్. 98
మూలగ్రంథం బిరువది
వేలఁట! పద్యాలఁ బెంచి • వెస ముప్పదివే
లాలీల భాగవతమున్
బూలన్ బెట్టితివి భక్త • పోతన తండ్రీ! 99
నైషధమా శ్రీనాథు సు
భాషధమాఁ గోవిదులకు; • నమరుల భాషా
పాషాణ పదసమాసము
భాషాంతరమైన మధుప్ర• వాహాన్వితమా, 100
మన నోరూరును నైషధ
మును, రాఘవపాండవీయ • మును మనుచరితం

బును, వసుచరితము, వసుధం
దనరెడు నాముక్తమాల్య ♦ దను బఠియింపన్. 101
శ్రీరామపురిని విలియము
కేరీ తెనిఁగించి హెబ్రి ♦ గ్రీకు బయిబి లిం
పారఁగ * ముద్రింపించెను;
గారవమున నెల్లరున్ జ♦గజ్జ్యోతి యనన్. 102

బద్దైన తద్దయు బుద్ధికిఁ
బెద్దనయా; నీతిశాస్త్ర ♦ వివిధవిధులకున్
బద్దెముల వ్రాయఁగనున్నల
కద్దుకొనరె చిన్నపెద్ద ♦ లనుదిన మిలలోన్? 103
వేమన నీతుల గీతుల
నేమనఁగలఁ? త్యాగరాజు ♦ నిష్కృతములో
రామన నుతులును సంస్తుతు
లా మనకున్ ద్రావిడులకు ♦ నాలాప్యంబుల్. 104
మలికిభరాముఁడు ప్రేమం
బాలికించెం గవుల మీఁద, ♦ నొకపు డమీన్ ఖాన్
తెలుఁగున నంకిత మొందెం,
బలుపొత్తంబులు రచించి ♦ ప్రచురించె హుసేన్. 105
అనఘుఁడు ప్రతాపరుద్రుం
డనెడు ప్రతాపుండు సంస్కృ ♦ తాంధ్రముల లిఖిం
చెను రాజనీతిశాస్త్రం
బును నేరిమి నోరుగల్లు ♦ పురవరము నన్. 106

* 1811—21 లో ముద్రితమయ్యె.

హితకారిణీ సమాజము
మత సాంఘిక సంస్కరణము ♦ మందారములౌ
శతకావ్యాదులు చాటవె
సతతము వీరేశలింగ ♦ శక్తిన్ భక్తిన్! 107
నవ్యకవులు తెలియ మెత్తఁగఁ
గావ్యాంగన సూపెఁ బత్రి ♦ కారత్నంబుల్
దివ్యప్రబంధములు సు
శ్రావ్యపు గానముల జ్ఞాన ♦ చంద్రిక లనఁగన్; 108
కొమరొప్ప "స్త్రీతి నామా
పిమధుర" మని యార్యులు విని ♦ పింపన్ సత్కా
వ్యము లెన్నని రచించిరి
తమ పురుషులకుట్టుఁ జట్టి ♦ తల్లుల్ పిల్లల్. 109
కుమ్మరి మొల్లమ్మయుఁ, గు
ప్పమ్మయు, నమ్మోహనాంగి, ♦ యమ్మణియమ్మా
కృమ్మయు, వేంకమ్మయు, బా
పమ్మాదులు స్తోత్రపాత్ర ♦ లగు కవయిత్రుల్. 110
"ఉవిదలు నేర్వఁగరాని చ
దువు గలదే" యంచుఁ గోవి ♦ దుఁడు నరసింహుం
డు వచించెఁ; గాన బాలిక
భువిలో సిగ్గనక శాస్త్ర ♦ ములు చదువఁగనా, 111
ఘన చాణక్యుని, నాగా
ర్జును, భావవివేకసూరి, ♦ సురుచిర భవభూ
తిని, విద్యారణ్యాదిసు
జనవిద్వాంసులను గన్న ♦ జనయిత్రిని బో, 112

చోద్యము తాతంభట్టును
బద్యముఖంబునను ఖండ ♦ పంచకముచేన్
"విద్యలలోపల నుత్తమ
విద్య కవిత్వంబ" టంచు ♦ వినుతింపంగన్ ? 113
ధర నెలనార్యుఁడు తోబ్యా
చరితం బానందకవియు ♦ సరసత వేదాం
తరసాయనము లిఖించిరి;
పురుషోత్తమ సుకవి పౌత్ర ♦ములు ముత్తియముల్, 114
"స రి గ మ ప ధ ని స" యను స
త్స్వరముల సృజియించి, భరత ♦ సంగీతంబున్
బ్రహ్మానందాబ్ధిని ముం
చిరి కారె యహోబలాది ♦ చింతామణులున్! 115
శృంగారరస మొకరునకు
బంగార మొకనికిఁ గాక ♦ బంగారంబౌ,
సింగారమైన యువతుల
కంగారము సుహృదయాల ♦ యముల దహింపన్, 116
ఆంగ్లేయు లాంధ్రకావ్యము
లాంగ్లీకరణంబొనర్చి ♦ యశమందంగా
నింగ్లీషెఱింగి మత్సుతు
లాంగ్లాంధ్రంబుల రచింతు ♦ రసమానకృతుల్, 117
ఓరిచి కష్టము, * బ్రౌనన్
నేర్చి పదజాల మోలి ♦ నిఖిలార్థంబుల్
దేరిచి, బ్రౌణ్య నిఘంటువుఁ
గూరిచి, ప్రచురించెను దెసఁ ♦ గున నాంగ్లమునన్, 118

* C. P. Brown (1798—1884)

ఆంధ్రేతరవరుఁడా *కా
రాంధ్రోక్తులఁ జేర్చి, మార్చి ♦ యాంగ్లేయమునం
దాంధ్రంబున సంస్కృతమున
నాంధ్రవ్యవహారదీప ♦ మన విరచించెన్. 119

అల సీతారామాచా
ర్యులు నాబాలప్రసిద్ధి ♦ నొందె దివారా
త్రులు కష్టించి రచించి దొ
రలు సన్మానింప శబ్ద ♦ రత్నాకరమున్. 120

తెనుఁగున సర్వస్వము లే
దని నేఁ దపియింపఁ గంకు♦రార్పణ మయ్యెన్
మును లక్ష్మణరా వొక్కటి,
నొనరికతో బాపినీడు ♦ నొకటి రచింపన్. 121

శ్రీ పీఠికాపురీవర
భూపతి "చిన్నాంబ" పేర ♦ ముద్రాలిపి సం
స్థాపించె; సూర్యరాయ
ప్రాపకమున నవ నిఘంటు ♦ రచనంబు నగున్. 122

బోధాయనుఁడు సృజించిన
బోధాయన శుల్బసూత్ర♦ములు గణితమునం
దాధారాధిక్యంబులు
బోధన సాధనము లఖిల ♦ బుధవృషభులకున్. 123

పుత్రిం డాపస్తంబుని
సూత్రములఁ బితాగొరస్సు ♦ సూత్రము లనఁ జా

* Captain M. W. Carr (1868)

రిత్రికు లొప్పెదురే? యవి
యాత్రిం గావించె నందు ♦ రయిరోపాకుల్. 124
రసవాదపుఁ బస మెఱుఁగని
వసుధకు నాగార్జునుండు ♦ వైజ్ఞానికుఁడై
రసవాద శాస్త్ర మొసఁగెను;
రసమగ్నులు కారె శాస్త్ర ♦ రత్నాకరులున్? 125
మన తెనుఁగునాట జన్మిం
చిన శ్రీరామన్ స్వయం కృషిని జేసియు * "రా
మ నెఫెక్టును" గనుగొనెఁ బృ
థ్విని యశమొసఁగన్ బదార్థ ♦ విజ్ఞానమునన్. 126
హైందవ తత్త్వాన్వేషణ
మందియు, గ్రంథాళి వ్రాసి ఐరోపాకున్
విందొనరిచి, యందఱకున్
బందుగుఁ డనఁ జెల్లు సర్వ ♦ పల్లికిఁ దల్లిన్. 127
మనుజుల మత సాంఘిక జీ
వనము మనుస్మృతిని యాజ్ఞ ♦ వల్క్యస్మృతిఁ గై
కొని పెంపగు; నాస్మృతులకు
మన * యాపస్తంబ కృతము ♦ మాతృక కాదే? 128
కర్ణాట సాహితియు సం
పూర్ణంబా పూజ్యపాద ♦ మోగళిసుకవుల్
గర్ణాట కావ్యములఁ గవి
కర్ణరసాయనము లనఁగఁ ♦ గావింపవిచోన్? 129

---

* Nobel prize for Physics in 1930

* Max Muller's letter to W. H. Morley published in in Digest of Indian Cases, 1850.

ఆపస్తంబీయంబును,
నేపా బోధాయనీయ ♦ మెంచఁగ నీరెం
డా "పంచసూత్రముల" ను
దీపనములు కావె భార , తీయుల కౌరా! 130

ఓషధులకు, నాయుర్వే
దౌషధముల కిరువు దేశ ♦ మనఁ; వైద్యకళా
భూషకులని, పోషకులని
శేషున కగు మన భిషగ్వ ♦ శేషము లెన్నన్. 131

అమరెను నేర్పాయుర్వే
దమునందు, యునానియందుఁ ♦ దనరఁ బ్రకృతి వై
ద్యమునందు, నల [illegible]ోపతి,
హోమియోపతిఁ బుత్రులా బహునిపుణు లెపుడున్. 132

తొలి బొంబాయి పురంబున
వెలసెన్; మన చెన్నపురిని ♦ జెరిగియు రోగా
ర్తులకున్ జింతామణియై
యలరు దిగంతంబుల నమృ ♦ తాంజనము బళీ! 133

మతముల కాలయమా భా
రతభువి వ్యాపించు మతప ♦ రంపరలను "భా
రతమత నిఘంటు వ" తిస
మ్మతిఁ దెల్పును గ్రీస్తుశర్వ ♦ మతమకుట మనన్. 134

అల కూచిపూడి గ్రామ
స్థులఁ, దమిళుల యూటుకూరి ♦ సునటుల మళయా
ళుల నంబుదిరీలను గనఁ
దెలుఁగు లఖిల భరతనాట్య ♦ తిలకము లనన్. 135

కులుకును, గోలాటము(, జిం
దులు, భజనలు, నాటకములు(, ♦ దోల్బొమ్మలయా
టలు, నృత్యంబులు మన వా
రల చతురత( జాటు(గద భ ♦ రతనాట్య కళల్. 136

తనరె సినిమా; కళ నా
తనమాయె; జగత్ప్రసిద్ధ ♦ తారాదులు; పెం
పొనరింప( దల్లి కీర్తి క
మన మాకళ కృషి నొనర్ప ♦ మాణిక్యమగున్. 137

పాటకు సూర్యకుమారియు,
మాటకు( గన్నాంబ తల్లి ♦ మాధుర్యమునం;
దాటకు నంజలి దేవియు
నీటున నెల్లరను శ్లాఘ ♦ నీయులు కారే! 138

ఆయుర్వృద్ధికి మూలము
వ్యాయామంబనిన "నిండి ♦ యన్ శాండో" యా
శ్రీయుతు(డు రామమూర్తికి(
జేసె త్రియు దీవెనలను ♦ జెప్పన్ దప్పన్. 139

నిరుపమ కళా ప్రపూర్ణులు,
సురళింప(గ నామహా మ♦హోపాధ్యాయుల్
సరసులు, శతావధానులు,
వర కవిశేఖరులు నా క♦వతరించి గదా! 140

హిందూస్థానియు(, దమిళము,
హిందియు(, గన్నడము, తుళు, మ♦హిన్ గుజరాతిన్,
గోండి, మరాటి, యొరియ యుం
పొంద(గ బెంగాలి సుతుల ♦ కొప్పు వచింపన్. 141

దిన వార పక్ష మాసా
దిని హిందూస్థానియందుఁ • దెలుఁగున, నింగ్లి
షున నాంధ్రపత్రికాదులు
ఘనమత రాజ్యాంగ సాంఘిక స్సువార్త లిడఁగా.
వారతి, రాయల సీమయు,
భారతి, రవి, గోలుకొండ • పత్రిక, వారిసఁగా,
మారుతికళ, యాంధ్రియు, జయ
భారతి, గృహలక్ష్మి, తెలుఁగు • బ్రాప్తిస్సు బళా!
అడుగిడెను దెనుఁగు గడ్డఁగ,
వెడలె బరోడకు; వివిధ • విషయంబుల కే
ప్పుడు భారతఖండమున వే
మడుఁగుల గ్రంథాలయోద్యమము హృద్యంబా.
మన తిక్కనకుం గందం
బని, శ్రీనాధునకు సీసమనియుఁగా, మునుచే
మన కాటవెలఁది యనియుఁగా
వినుతింపరె? మీకుఁ గవిత • విందా? మందా?
వినమే తిక్కన సూర్యుం
డని, పోతన చంద్రుఁడనియు • నష్టకవీంద్రుల్
మన గ్రహములంచు, శేషిం
చిన కవితతి తిక్కలని వచింప నెవ్వల్?
కొనరేటికో! కొన్నఁజదువు
కొనరేటికో! కవితఁజదువు • కొన్నగదియుఁ గ్రా
కొనరేటికో! కైకొని మే
ల్కొనరేటికో! భిన్నరుచులు • లోకస్థులకున్,

## 3. నావాల్లభ్యము.

“ఏతేఽంధ్రా” యని మున్నీ
రీతిని బేర్కొనియె నైత ♦ రేయాఖ్యుండుఁ,
తొన్మితలమున నాంధ్రులును బు
రాతనజను లన్న నిద్ది ♦ ప్రామాణ్యంబౌ. 148

శివమత మవలంబించిన
నవనాగరకప్రజనంబు ♦ నాజనమంచున్
భువి “విశ్వగుణాదర్శము”*
వివరింపఁగ సంస్కృతమున ♦ విశ్వసితంబౌ. 149

మన దక్షిణాపథంబున
జనులెల్లరు వాడు “శాక ♦ శకమును” శతవా
హన భూపాలురు స్థాపన
మొనరించిరఁ టన్న విన్న ♦ నుబ్బుదు రాంధ్రుల్. 150

ఇక్కడ, విదేశములను, మ
ఱెక్కడ మిక్కిలి ప్రసిద్ధి ♦ కెక్కుదురు సుతుల్,
రక్కసు లణఁగం ద్రొక్కినఁ
జుక్కలలోఁ జంద్రుఁబోలి ♦ శోభిలఁ గనమే! 151

మును గోలుకొండచరితం
బున భారతభూమి నాంధ్ర ♦ భూమీశుల పా
లన మాద్యంబనుచు నశో
కుని శాసన లేఖనములు ♦ ఘోషించు సదా. 152

ఆసేతుహిమాలయమున
నా సామ్రాజ్యముల స్థాప ♦ నవ్యాపనముల్
జేసి, నిరంకుశు లన సిం
హాసనము లలంకరించి రాంధ్రనరేంద్రుల్. 153

తొలి శాతవాహనులు, నాడ
యులు పల్లవులెల్ల, శక్తి ♦ యుక్తులు చాళు
క్యులు, సాలంకాయన రా
జులు పాలించిరి ప్రశాంతి ♦ జొక్కొట్టంగన్.

విలసిల్ల విష్ణుకుండిను,
లలరంగఁ గళింగరాజు, ♦ లల గజపతి భూ
పులు, పలుతూరుపు చాళు
క్యులు నేలిరి రామరాజ్య ♦ యుగమహిమ మనన్.

మన కాకతీయపాలకు
లును, విజయనగర నరేంద్రు ♦ లును, రెడ్డినృపుల్
ఘన నైపుణ్యసుపుణ్యం
బునఁ బాలన సల్పి రాంధ్ర ♦ భూకేంద్రమునన్.

యాదవులు, రాష్ట్రకూటాం
ధ్రాదులు రసపుత్రులనియు ♦ సామ్రాజ్యము శ్రే
యోదాయకమని యది య
త్యాదర్శసువర్ణకాల ♦ మనె నాండర్సన్.

మౌర్యాదులవలె నాంధ్రులు
ధైర్యస్థైర్యమున నరుల ♦ దండించి ప్రజా
కార్యధురంధరులై రని
వార్యంబౌ నంగరంగ ♦ వైభవ మొప్పన్.

రోమీయు లనఁగ దక్షిణ
భూమిని బాలించి సైన్య ♦ ము నునిచి రాజ్య
క్షేమం బరయు మహాంధ్రులు
సామాన్యులు కారఁటంచు * సర్వస్వ మునన్.

♦ Cyclopaedia of Literature

తంజావూరి తమిళజన
రంజకులై నాయకాళి • రాజులు పగలన్
బింజ మణఁచి పాలించిరి
పుంజిగ రాజ్యంబు నూట • ముప్పదియేఁడుల్. 160

ప్రధనమున గెల్చి యఱవల
యధిపతులై దీర్ఘకాల • మభ్యుదయమునన్
మధురపురం బేలిరి, శ్రీ
మధురాంబకుఁ దోడునీడ • మనవారు సుమీ. 161

మును రష్యనులా చర్మం
బును, నైతియోపీయు లుప్పు • మున్నగు వానిన్
మన నృపులు రాగి సీసం
బును వెండిని నాణెములుగ • ముద్రించి రహా! 162

ఘన చాణూరుఁడు శ్రీకృ
ష్ణునకున్ దన్మల్లియుద్ధ • శూరతఁ జూపిం
చెనుగద; మహాంధ్రమల్లుం
డని ఖ్యాతింబొందె భార • తావనియందున్. 163

ప్రముఖుండు శాతవాహన
నిముఖుండు ప్రథమనృపుండు; • చెడ్డపనులకున్
విముఖుండు; రాజనీతికి
సుముఖుండనుగాఁడె తెలుఁగ • శోకుం డనఁగన్ ! 164

అల రుద్రమ గణపాంబా
ఖ్యలు సామ్రాజ్యముల నేలి • తొలఁచియుఁ గష్టం
బులను, బ్రిబంధములను వా
ర్యఁ దాంగిని సబల సబల • యనఁజనఁ గాదే ! 165

క్షితి నాంధ్ర భోజబిరుదాం
కితుఁడై, సారోత్కలాంధ్ర ♦ గీర్వాణసుపం
డితుఁడౌ శ్రీ విక్రమ భూ
పతి జయపురి ఱేఁ డనుంగుఁ ♦ బట్టి యుపంగన్. 166

అక్కన్నయు, మాదన్నయుఁ
దిక్కన, పూర్ణయ్య, శివయ ♦ తిమ్మరసాదుల్
జక్కని సచివోత్తము లన
ముక్కపయిని వ్రేలు బెట్టఁ ♦ బో రెవ్వారల్. 167

కట్ట యుని యన్య శ్రీమఁగని,
పట్టయి మంచికి, సువిద్యఁ ♦ బడయ విరామం
బెట్టని, త్రిలింగ వాణికిఁ
బొట్టౌ మన రెడ్డిఁ బోలు ♦ బుధుఁ డెవఁడు భువిన్? 168

చూడుఁడు సరోజ నమ్మయుఁ
గోడలి ననుకొనక కన్న ♦ కొమరితగతిఁ జేఁ
దోడును వాదోడును జే
కూడఁగఁ గట్టించెఁ దోడి ♦ కోడండ్రలరన్. 169

నాగేశ్వరరావనఁ జను
త్యాగులు, పట్టాభిఁ బోలు ♦ దక్షుల్, రాజో
ద్యోగులు శాంతి మహాత్ములు
వేగురు కలరంచు నింక ♦ వేనోళ్ళందుర్. 170

పరవస్తు, టంగుటూ, రీ
దర, పింగళి, చెళ్ళపిళ్ళ ♦ తాతా, ముట్నూర్
వరహాగిరియు, శ్రీపాద, త్రి
పురనేనియు, మోతే, కొండ ♦ పుత్రిల్ ప్రముఖుల్. 165

మొదటను బౌద్ధము, జైనము,
విదపక హిందూమతమున ♦ విష్ణుశివమతా
ళిది యది పట్టితిని; మహా
మ్మదు క్రీస్తుమతముల కిపుడు ♦ మార్గము లయ్యెన్, 172

సతము చతుర్వేదాల్, భా
రతాదులును, బైబిలును, ఖురానున్, నానా
మత సంస్థలు, తీర్థాదులు
నతులిత మద్భక్తి కెల్ల ♦ నాదర్శకముల్. 173

శుద్ధాద్వైతము వల్లభుఁ,
డిద్ధర నాగార్జునుఁడు మహేశ్వర భక్తిన్
బౌద్ధ మహాయానము, బల్
శ్రిద్ధను బసవండు వీర♦శైవం బిడరే? 174

ఇష్టములనఁ బూత్రములన
నిష్టంబులు; శ్రేష్ఠములని ♦ మెచ్చి యొరులు సం
తుష్టాంతరంగు లగుటకుఁ
గష్టింతురు కారె చిన్న ♦ కన్న కుమారుల్? 175

వైద్యంబు, ముక్తి మార్గము,
విద్యాసంపదనుగూర్చి ♦ వేవిధముల దే
శోద్యమములలోఁ బాల్గొను
నాద్యులు క్రైస్తవు లనఁ బరు ♦ లౌనా ననరే! 176

ఒంగోల్ బ్రిభ, గుంటూర్ జిల్లఁ
గంగఁ గళాశాల, దోర్నకల్లు మిషన్ బల్
శృంగార మెదక్కాలయ
మంగులును, దెలుఁగు క్రైస్తవాదర్శకముల్. 177

మా స్త్రీపురుషులు కాలుచు
వస్త్రాదులు, ధారణమును • మాటను లన్నన్
శాస్త్రులును వల్లె యనరే ?
వస్త్రంబులఁ గొని ధరింత్రు • వైదేశికులున్. 178
ఎక్కువ తక్కువ లెంతురు,
తక్కువ లెక్కువలు లేవు • తల్లికి, మీలో
నెక్కువ తక్కువ లేటికి ?
దక్కువ లెక్కువలు ప్రేమ • తగ్గిన హెచ్చున్. 179
తెలుఁగు లనాది నివాసులు,
తెలుఁగులలో నాద్యు లనినఁ • దెనఁ గస్పృశ్యుల్,
కులహీనులా మహాంధ్రులు !
కలలో నిది విన్నఁ గన్న • కడుపు తఱుఁగదే ! 180
హరిజనులు విష్ణుభక్తులు,
బిరుదిడెను మహర్షి గాంధి • పెద్దతల యనన్,
హరిజను లస్పృశ్యులు, శ్రీ
హరికిన్ హరిజనుల కేల • యంటున్ సంటున్? 181
వా రేమిటి ! వీ రేమిటి !
వారికి వీరికిని వేఱు•బంద మ్మగునే !
వా రన్నలు, వీ రనుజులు,
చేరెడు రక్తంబు మీరు • చెఱిసగముకదా ! 182
నను గన్న జనని యొక్కతె;
నను గాచియుఁ బెంచు లోక • నాథుఁ డొకఁడె; నా
తనయులు నొక్కటె; చూడం
గను సర్వం బేకవా జ • గన్నాథముగన్. 183

మ్మాలలు మాదిగలును మ
ద్భాలురు; ద్విజ శూద్రులన్నఁ • బంచము లన్నన్
బాలెవరివి ? నీళ్ళెవరివి ?
మాలలు మాదిగలు మనుజ • మాతృలు కారే ? 184

బలు పంకంబునఁ బంకజ
మలరెడు చందమున నాది • మాంధ్రులలోఁ బ్రా
జ్ఞులు, భక్తులు, కవివరులును
వెలసిరి క్రైస్తవ్యమునను • వెయ్యేటి కిఁకన్ ? 185

పలు శాఖలేల ? మతీ ని
ర్మల భావ మగత్య మైక • మత్యంబుగదా
బల మందు; రది నిజము; పె
ద్దల మాటలు పెరుఁగు కూడు • తలమానికమా, 186

తెలుఁగు లన నింట బైటను
గెలచిన నేర్పరులు; చేయి • క్రిం దనకుండన్
విలసిత నానోద్యోగం
బులను స్వదేశ పరదేశ • ములఁ జేసి రహో ! 187

ఆదిజనంబన, పూరాణుల
యాదిమ సామ్రాజ్యమన్న • నాంధ్రుల దంచున్
వాదించి, స్వరాష్ట్రము సం
పాదించెడు దనుక నిద్ర • పట్టునె మనకున్ ? 188

అక్కయుఁ జెల్లియ యగు నా
తక్కటి రాజ్యాల లీల • దక్కక వెనుకం
జిక్కితి; నేనొక్క ర్తుక;
మక్కువఁ బాపుఁడు స్వరాష్ట్ర • మమతయుఁ దీఱన్. 189

వారా స్వరాజ్య వాదులు
వీరాగ్రేసరు లంటన్న ♦ వెగటేటి కిటన్ !
తేరా యుధిపులు ? ధీరులు
కారా మావారు రాజ ♦ కార్యసమర్థుల్ ! 190
పోలుచునెడ బెల్జియము,
హాలెండ్, డెన్మార్కు-కన్న ♦ నంధ్రం బన్నన్
నాలుగు రెట్లధికంబు వి
శాలత కల్గిన స్వరాష్ట్ర ♦ కని పోవు నొకో ! 191
ఆశామ్, సింధు, నొరిస్సా
దేశాదులు మా త్రిలింగ ♦ దేశముకన్నన్
లేశంబులు; చాలును మా
దేశాదాయము స్వరాష్ట్ర ♦ తిలకము దిద్దన్. 192
చెలువొప్పు సింధు, పంజా
బులు, బొంబై, మధ్యరాష్ట్ర ♦ ములు, బర్మాశా
ములకన్నఁ దెలుఁగు గడ్డయు
నలరును జనసాంద్ర మన ని♦రాక్షేపంబా. 193
తెలుఁగోరియ, తెలుఁగు నుర్దును,
తెలుంగు కన్నడమును, మఱి ♦ తెనుఁ గరవంబున్
గలుపునెడఁ దెలుఁగునా డా
తలలో నాలుకయుఁగాదె ♦ దక్షిణభూమిన్ ! 194
అంతర్వివాహమన నా
కంతర్భోజన మనఁ బర ♦ మానందము; కా
సంత్రైన ద్వేష మొల్లను;
పంతస మెంతయును సంఘ ♦ సంస్కరణ మనఁగా. 195

ఆద్యము మనఁదగు మన యాం
ధ్రోద్యమ మటువెన్క హరిజ ♦
విద్యార్థుల, రైతుల, నా
నోద్యమములఁ బాల్గొనంగ ♦ నుద్యుక్తంబై. 196

నింగిఁ దెలుంగు పతాక యె
సంగుట, పూర్వాద్వితీయ ♦ సామ్రాజ్యం బు
ప్పొంగుట, స్వాతంత్ర్యము చె
లంగుట కని ముఱియుఁ దఱియ ♦ లభియించునొకో! 197

ఆంధ్రస్వరాష్ట్ర మరయక
యాంధ్రోహమ్మనుచు మఱియ ♦ నాంధ్రత్వంబా!
యాంధ్రధ్వజ మల్లాడిన
నాంధ్రాభ్యుదయమున నంతు ♦ రార్పణ మనసా. 198

అందని మ్రానిఫలము మన
కెందులకో యనక యైక్య ♦ మే బలమని కో
రందగు; మహాంధ్రరాష్ట్రం
బందఱకు; శుభస్య శీఘ్ర ♦ మందు్ర కవీంద్రుల్. 199

కావలెను విశాలాంధ్రము;
కావలెను స్వరాష్ట్ర; మాత్మ ♦ గౌరవ మొందం
గావలెను; స్వర్గ రాజ్యముఁ
గావలె నాచంద్రతార ♦ కంబుగ వెలుఁగన్. 200



1. ఆంగ్లేయ శతకము రు 0-2-0
2. ప్రసంగ సారము 0-8-0
3. సమూయేలు చరిత్ర 0-6-0
4. ఏ.బి.ఎం. మాహాత్మ్యము 0-1-0
5. విజ్ఞాన మంజరి 0-2-0
6. యోనా కథావళి 0-0-8
7. బుల్లార్డు చరిత్ర 0-2-0
8. స్త్రీ మార్గదర్శిని 0-0-6
9. జూబిలీ నవరత్నమాల 0-0-6
10. జగజ్జయము (ఖండకావ్యము) 0-4-0
11. నేనేల త్రాగను? 0-2-6
12. సుహిత శతకము 0-0-6
13. కావ్య చంద్రిక 0-4-0
14. అర్టబాను (నాటకము) 0-4-0
15. గలతీయుల పత్రిక 0-6-0
16. బైబిలు వేదరాజము 0-10-0
17. క్రీస్తుసర్వజన సర్వస్వము రు 0-4-0
18. ముంచడము 0-2-0
19. ఆరోగ్య కీర్తనలు 0-4-0
20. జగత్సువార్త 0-4-9
21. కొత్త వింతలు 0-2-0
22. 100 అడుగు జాడలు 0-4-0
23. అస్పృశ్యత (ఖండకావ్యము) 0-4-0
24. పంచస్వతంత్రము 0-8-0
25. అమ్మ (ఖండకావ్యము) 0-4-0
26. సాక్షి (భగవన్ముక్తి) 0-6-0
27. ,, (భగవదుక్తి) 0-6-0
28. ,, (భగవద్భక్తి) 0-6-0
29. ,, (భగవచ్ఛక్తి) 0-6-0
30. ఆంధ్రమాత (ఆత్మకథ) 0-8-0
31. దురాత్మ శతకము C. L. S. (Madras) ... 0-0-6
32. బాల ప్రార్థనలు ,, ,, ... 0-2-0
33. దావీదు కీర్తనలు ,, ,, ... 0-4-0
34. జగద్రక్షణము (కాలక్షేపము) ... 0-10-0
35. ప్రశ్నోత్తర ప్రకాశిక (Part I) ... 0-4-0
36. ,, ,, (Part II) ... 0-2-0
37. గ్రామ సేవ (Part I) ... 0-4-0
38. ,, (Part II) ... 0-4-0
39. భారత మత నిఘంటువు (Vol. I) ... 0-6-0
40. 100 Homiletical Helps ... 0-2-0
41. Fight for Freedom ... 0-4-0
42. DORNAKAL ... 1-0-0

Rev. MALLELA DAVID,
Jasmine Kuteer, Kothagudem, Deccan.